# బాల గీతాంజలి

## పిల్లల పద్యాలు



సాలా జంగయ్య

# బాలగీతాంజలి



అంతర్జాతీయ బాలల సంవత్సరం

**1979**

ంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభవారి ద్రవ్యసహాయంతో

రచయిత :

నీలా జంగయ్య

# ప్రకాశకీయం

కవిరత్న శ్రీ నీలా జంగయ్యగారి సారస్వత రజతోత్సవాల సందర్భంలో ఈ బాలగీతాంజలి గ్రంథాన్ని ప్రకటించవలెనన్న మా సంకల్పాన్ని ఆంధ్రప్రదేశ్ ఆర్య వైశ్య మహాసభ వారికి తెలియచేస్తూ ఆర్థిక సహకార మడిగితిమి. వారు కాదనక వెయ్యిరూపాయలు ఇచ్చుటకు సమ్మతించి వెంటనే చెక్కు ద్వారా కవిరత్న జంగయ్యగారి పేర పంపించినారు.

ఈ గ్రంథం కవిగారి తొలిరచన. చక్కని నీతులుగల ఈ ఆటవెలది పద్యాలు 1956లో ప్రకటిత మయినాయి. ఆంధ్ర బాల బాలికలకే గాక పెద్దలకు సైతం పనికివచ్చే గ్రంథమిది.

ఈ కృతిని మల్లీశ్వరునకు అర్పించి కవి చరితార్థుడయినాడు.

వారి సారస్వత రజతోత్సవ సన్మాన సంఘం ద్వారా ప్రచురిస్తున్న ఈ శుభ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ ఆర్య వైశ్య మహాసభ అధ్యక్షుల వారికి మరియు కార్యవర్గానికి మా ప్రత్యేక ధన్యవాదములు.

20–10–78
హైద్రాబాదు.

N. శ్రీధర్
శ్రీదేవీ పబ్లికేషన్స్

"శ్రీవాగీశ్వర్యైనమః"

# తొలి పలుకు

"ఉత్తమ కవితా లేఖన
చిత్తమ్మెల్లరకు నరక జిక్కునె కూర్పన్
విత్తమ్మా నేరిచి కొన
పొత్తమ్మా పూర్వ జన్మ పుణ్యము కాకన్"

అనునట్లు పూర్వజన్మ పుణ్యముననే కవి యనుపించుకొను భాగ్యము గల్గును. శాస్త్రములు సాధనతో స్వాధీనములగును. పాండిత్యమును ప్రయాసపడి సంపాదింపవచ్చును.

కాని కవితాకన్య; "స్వయమే వాగతావరా" యను నార్యోక్తి ననుసరించి, సంచిత పుణ్యకర్మునకే కాక సకలమానవులకు ఆ కన్యక కరుణాకటాక్షము అబ్బునా ?

కాని కవియై ప్రతిభావంతుడైనంత మాత్రమున పాండిత్యమవసరము లేదనుకొనుట వెఱ్ఱి. ప్రతిభ వ్యుత్పత్తితో గూడినదై నప్పుడే సానబట్టిన జాతిరత్నమువలె ప్రకాశించును. ప్రతిభ సౌందర్యము వంటిది. పాండిత్యము కండపుష్టి వంటిది. నేత్రాదికమైన అంగసౌందర్య మెంత గల్గియున్న అంగనయైనను కండపుష్టిలేని శల్యపంజరముతో శోభించలేదు.

అందుకే ప్రతిభావ్యుత్పత్తులు దేహి దేహమువలె అవినాభావ సంబంధముతో నలరారుచుండును.

ప్రస్తుత మీకవి తన కావ్యమును పరిశోధింపుమని నాకొసంగెను. ఇతడు మా జనతా కళాశాలలో శిక్షణ పొందునపుడే కవితా రచనోత్సుకత కల్గి చిన్న చిన్న పద్యములు రచించు చుండెడివాడు. ఇతని కృషికి నా ప్రోత్సాహము దోహదమై ఈ కావ్యాకృతిని దాల్చినది.

ఇతడీ కావ్యమునకు బాలగీతాంజలి యను నామకరణ మొనర్చుట బాల్యావస్థలోనున్న ఈతని కవితాంగన కన్వర్థమై యొప్పుచున్నది.

దీనిలో ఆటవెలదులతుద వేమన్నవలె, ''వినర తెలుగుబాల వినుతశీల'' యను మకుటము గూర్పబడి ఇంచుమించు వేమన పద్యముల దలపించు కొన్ని కొన్ని నీతిబోధకములగు నాటవెలదు లగుపించును.

రచన అందచందముల నలరారుచు అతిసహజ గమనముతో సాగినది.

''పాలు ద్రావినట్లు బలమిచ్చి రక్షించు
మంచివారితోడి మైత్రిసేయ
కల్లు ద్రాగినట్లు కలచు దుర్జనుమైత్రి'' అను పద్య ముత్తమముగా నున్నది. ;ఈతడిడినమకుటముదీసి, ''విశ్వదాభిరామ వినర వేమ'' యను మకుటమిడిన వేమనదేనని విశ్వసించుటకు యే మాత్రము సందేహములేదు.

ఇతని మాతృభాషాభక్తి ఈ క్రింది పద్యమే వేనోళ్ళ చాటుచున్నది.

''వసుధ మానవులకు ప్రాణమెంతయు తీపి, భాషలందు తెల్గు భాషతీపి'' యను పద్యము వ్రాసి అత్యంత సార్థకమైన దీతని జన్మ.

''జనని, మాతృభాష, జన్మభూమియు, నిన్ను
గన్నతల్లులంచు కాంతుతోడ
సేవజేయునెడల దేవపూజ లవేల''

యని వ్రాసి తన దేశ భక్తిని మాతృభాషాసక్తిని ప్రకటించుకొనినాడు. ఈతని కావ్యములో ఇట్టి మెరుగుగల పద్యము లెన్నియేని గలవు. మున్ముం దీతడీ రంగమున నితోధిక కృషియొనర్చి, ఆంధ్రకవులయందు అందెవేసిన చేయియగుగాక యని ఆశించుచున్నాను.

ఇట్లు,
**వానమామలై వరదాచార్యులు.**
జనతాకళాశాల, దోమకొండ.

10-3-1956

శ్రీ కవిచక్రవర్తి, శతావధాని, విద్వాన్
దోమా వెంకటస్వామి గుప్తగారి

# అభిప్రాయము

బాల మనోజ్ఞ శీలమున భంగురభంగి వెలంగ మేలి యు
ద్వేల శుభంబు దేశమున విశ్రుతరీతి నొసంగజేతు నీ
బాల సునీతి నామకృతి భారతదేశము నందు నంతయున్
మేలగు పుస్తకావళి నమేయ పదంబును గాంచి మించుకన్

మా కందవనంబును గని
మాకందంబంచు పికము మాటికినిం గూ
హాకారం బొనరించిన
నీ కన్నె కవిత దెసల వెలుగున్ గాకన్.

ఇట్లు
దోమా వెంకటస్వామి గుప్త

# పండితాభిప్రాయము

"బాలగీతాంజలి" - రమ్యమగు నాటవెలదులు తమ ప్రేమ గీతాంజలి వలన రసికజనుల నాకర్షించునట్లు - సద్వృత్తములైన ఈ ఆటవెలదులు పామరజనులకు నాకర్షకములై సద్వృత్తిని గలిగించునని నా విశ్వాసము.

నా మిత్రులైన శ్రీ నీలా జంగయ్యగారి ప్రయత్నము చాలా ప్రశంసించదగినది. రచనోత్సాహము మెండు. భావోద్రేక మధికము. సాధ్యమైనంతవరకు స్వీయభావములను ఉన్నదున్నట్లు పొందుపర్చు స్వభావము. కావున లక్షణమును కొంచము నిర్లక్ష్యము చేసినను అందము చెడదు. ప్రథమప్రయత్న మీ రీతిగ సాగినను వీరి యుత్సాహమును గమనించినచో ముందుముందు సర్వతోభివృద్ధినిపొంది సర్వాంగ సుందరముగా రచనల సాగించగలరని ఊహించుట కవకాశ మున్నది.

వీరి రచన, లోకోపకారియగుగాక యని నా ఆశీస్సు.

ఇట్లు,
*విద్వాన్ - విశారద,*
**ఎన్. శఠగోపాచార్యు.**
ఆంధ్రోపాధ్యాయులు,
గవర్నమెంట్ హైస్కూల్, దేవరకొండ

***20-5-1958***



# తొలి రేక

కవితా వ్యవసాయం శ్రమకరమైన పని. దీనివల్ల లాభించేది ఏమీ లేదు. అయినా అనేకులు ఇందుకు పూనుకుంటున్నారు. కారణం, దీనివల్ల మనస్సుకు తృప్తి ఏర్పడుతుంది. దూరాన ఆశారేఖ కనబడుతుంది.

ఈ రచయిత ప్రారంభించిన కృషి గొప్పది.. "అనగ నసగ రాగ మతిశయిల్లుచునుండు" అన్నట్లు వ్రాస్తుంటేగాని వన్నెరాదు.

బాలగీతాంజలి తొలిరేకగా ఈ కవితాకాంతి క్రమంగా అతిశయిల్లి ఆంధ్ర సాహిత్యానికి ఉన్నతోన్నత స్థితిని చేకూర్చిపెట్టాలని హృదయపూర్వకంగా కాంక్షిస్తున్నాను.

—"దాశరథి"

హైదరాబాదు
25—5—1956.

# ప్రార్థన

ఏ భాషలోనైనా ఉదయించిన కవిత్వాన్ని బట్టి ఆ భాషను సంస్కార మయిందని చెప్పుకొంటు ఆ భాషా వైభవాన్ని చాటు కొంటాం. మేము పెద్దల మనుకొనే వారంతా పిల్లల కోసం ఎంతో చేయవలసి ఉందును. పిల్లల కోసం చేసే ప్రతి పనీ పెద్దలకు ఆనందాన్ని ఈయడమే గాక అది వారికి కూడా ఉపయోగమవుతుంది.

ఏదేశమందైనా పిల్లలకు లక్ష్యంగా అన్నిరంగాలలో గణనీయమైన కృషి నిరంతరం జరుగుతూ ఉండవలసిందే. పెద్దలకు వారసులు పిల్లలే గనక.

పెద్దలు దివ్యాంతః పురాలలో నివసిస్తూ అనంత సుఖభోగాలనుభవిస్తూ పిల్లలకు మంచి పాఠశాలలను - చక్కని అధ్యాపకులను - దేశీయమైన భాషలలో మంచి గ్రంథాలను సమకూర్చు కొనలేక పోయినచో ఆజాతి అభ్యుదయం కుంటు పడక తప్పదు.

సాహిత్య మర్యాదలో సంస్కారం ఉంటుంది. ఏభాషలోనైన చదువుకొన్నాను, అని అనుకొనే వానికి ఆ భాషలో ఉన్న మంచి కవిత్వమేదో తెలిసే ఉండవలసి వస్తుంది.

భారతదేశం బానిసత్వం నుంచి బైటబడి 30 సంవత్సరాలు కావస్తున్నా కుగ్రామాలలోనే గాక మహానగరాలలో సైతం పిల్లలకు సరియైన పాఠశాలలు దేశీయమైన భాషలలో నెలకొనక పోవడం దురదృష్టంగానే సంభావించుకొందాం. బాల సాహిత్యం పేరుతో చెలామణి అవుతున్న గ్రంథాలు పిల్లల పేరుతో చేయబడే ద్రవ్యాలఖర్చు లెక్కలలో అద్భుతంగానే కనిపిస్తాయి. కాని ఆ పిల్లలకు వంటబట్టించే కార్యక్రమంలో మనమెంతముందుకు పోయామో ఆలోచిస్తే మనకే స్పష్టపడుతుంది. మన వ్యవస్థ తమ పిల్లల్లోనే ప్రతిబింబిస్తుంది. పట్టుమని పది పద్యాలు రాని పిల్లలు కోకొల్లలుగా ఉన్నారు.

భారత-భాగవత-రామాయణ గ్రంథాలు చదువకుండా నాకు

చదువువచ్చును అనే వాణ్ణి మన మేమను కోవాలి? వేయి నవలలు చదివినా - ఒక్క రామాయణం విలువ కాదు. అన్న సంగతి వ్యక్తి గ్రహించాలి.

బాల్యంలో పిల్లలకు నీతి గ్రంథాల ఆవశ్యకత ఎంతో ఉన్నది. వారి ఈడు నెంచి – ఆ నీతిగ్రంథాలు – పాఠ్యాంశాలుగా ఉండాలి. వారివయస్సు ననుసరించి ఆ గ్రంథాలు ఉండటం ఎంతో అవసరం.

పదకొండేండ్ల నా అధ్యాపక ప్రవృత్తి జీవితంలో పిల్లలకు సరియైన విద్య లేదన్న సంగతిని గ్రహించి బాధపడినాను. పెద్దలు తమ తమ కార్యక్రమాలలో నిమగ్నులై పిల్లల్ని విస్మరిస్తుంటారు. దానివల్ల బాలురకు తీవ్రమైన నష్టం వాటిల్లుతుంది.

ప్రభుత్వం – సంఘం – మేధావులు పిల్లలకోసం ఎంతో చేయవలసి ఉన్నది. అన్నవస్త్రాలు – విద్య - ప్రవృత్తులు – గృహాది విరామస్థలాలు – అత్యంతావశ్యకములై ఉన్నవి.

కోట్లు వ్యయం చేసి దేవాలయాలు కడతాం, అటులే ముందు పిల్లలకు పాఠశాలలు కూడా నిర్మించాలె నన్న తహ తహ కూడా పెద్దలకు కలిగి ఉండాలి. పిల్లలకు పుస్తకాలు కూడా రూపొందించాలె. విద్యాదానం పరమోత్తమమైన దానం–దాతలు ఈ రంగాన్ని సుశోభితం చేయవలసి ఉన్నది. ఏ ప్రభుత్వంలోనైనా ఆశయాలు ఆనందిచేవిగానే ఉంటాయి - కాని అమలులో అవి అష్టకష్టాలు కూడా ఎదుర్కొ్క లభ్యం కాకుండా ఉంటాయి.

ధనవ్యయం చేశామన్నది కాదు - దానితో కలిగిన ప్రయోజనం అతిముఖ్యం,

నిష్ప్రయోజనాన్ని ఇచ్చే విధానాలు–దేశంలో అడుగంటాలె. నిరాదరణీయ వ్యవస్థకు శరవేగంగా తిలోద కాలియడానికి జనం ముందుకు రావాలి - మానవాభ్యుదయానికి బాలురలో పునాదులు వేయాలె,

ప్రగతి శీలమైన దేశాలు - పిల్లలనే లక్షణాలుగా తీసుకొని

భావిజీవితానికి బాటలు వేసుకొంటాయి.

నీతిహీనమైన సాహిత్యం జాతికిచేటు నిస్తుంది. మనదేశంతో ప్రతి వ్యక్తి మొనగాడే కాని అది దేనిలో సన్నదే చెప్పుకో గలగాలె. ఎవరి మనస్సు వారికి అద్దంవంటిది. అందులోనే తన అంతరంగమైన భావరూపాలను చూసుకొనవలె.

ఎంత మొత్తుకున్నా వినేవాడే లేకపోతే ఇంక చేసేవారెవ రుంటారు. భర్తృహరి సుభాషితాలు, సుమతి నీతిపద్యాలు, చిన్నయ సూరి నీతిచంద్రిక, వేమన పద్యరత్నాలు వ్యర్థమైనవని వదలి వేస్తు న్నామా ? చదివితే జ్ఞానం గాదనుకుంటున్నామా? లేక చదవడం కష్టంగా ఎంచి వదలి పెడుతున్నామా ? ఈ ప్రశ్నలు మనం వేసుకొన వలె. దేశాన్ని అధ్యాపకులు – కవులు పండితులు – వితరణశీలురు – ధన దాతలు – మేధావులు తీర్చిదిద్దక పోతే ఏర్పడిఉన్న హీనస్థితిని ఎవడడ్డ గలడు ? ఇంజనీర్లు భౌతిక దృక్పథంలో ముందుకు పోయినామంటు న్నారు. వారు మంచి సంపన్నులు కూడా అయినారు. పది సంవత్స రాల క్రితం ఆస్తులు లేనివారు – వ్యాపారంలో – రాజకీయంలో – సంపన్నులై భోగాలనుభవిస్తున్న కొందరు ఈ పిల్లల కోసం ఏమైనా ఖర్చుచేయరాదా ?

నగరాలలో – ఇండ్లు ఇండ్లను కంటున్నాయి. డబ్బులు డబ్బు లను కంటున్నాయి. ఇంక తెలివితేటలు చదువులలో ఎక్కడున్నాయి? అనుకుంటున్నారు కొందరు. ఇవి బుద్ధిమంతులకు లక్ష్యాలు కారాదు. అక్రమ విధానాలు జాతి అభ్యుదయానికి దుర్భరస్థితిని సమకూరు స్తాయి. ఒక్కసారి నీ బిడ్డడిని చూసి నీవాలోచించు. మంచి విద్యా ర్థిగా రూపొందే వాతావరణం దేశంలో నెలకొల్ప ప్రయత్నించు. ఈ గ్రంథం నీ లక్ష్యంలో తోడ్పడితే ఉపయోగించు. నా వంతు పని నేను చేశాను. మీరు మీ వంతు చేయాలని ఈ నా ప్రార్థన.

హైదరాబాదు.
**20–10–1978.**

నీలా జంగయ్యా.

# తప్పొప్పుల పట్టిక

| పేజి నెం. | పద్యం నెం. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 10 | 30 | నుచ్చు | నిచ్చు |
| 17 | 57 | మొగ్గు | మెగ్గు |
| 20 | 58 | తత్కిడు | నత్కిడు |
| 22 | 78 | సోదరునితో | సోదరునితా |
| 27 | 98 | తండ్రి | తండ్రికి |
| 28 | 101 | నివుర | నివురు |
| 30 | 111 | జిల్లిన | జల్లిన |
| 31 | 114 | పియ | ప్రియ |

# కృతి సమర్పణము

తెలుగు బాలకులకు వెలుగు గూర్చగ నెంచి
చెప్పినట్టి యిట్టి చిన్నకృతిని
విశ్వరూపుడైన ఈశ్వరు కర్పింతు
వినర తెలుగుబాల ! వినుతశీల !

# బాలగీతాంజలి

## దైవస్మృతి

ఎల్లలోకములకు చల్లని వెలుగిచ్చి
సర్వ కర్మలకును సాక్షి యగుచు
మేలొనర్చు పితకు కేలెత్తి మ్రొక్కుదు
వినర తెలుగుబాల ! వినుతశీల !

మహితు డెవ్వ డాది మధ్యాంతరహితుడై
సకల లోకసృష్టి సలుపు నెవడు
అట్టి దేవదేవు నతిభక్తి ధ్యానింతు
వినర తెలుగుబాల ! వినుతశీల !

పాప పుణ్య రహితు పరమాత్ము నఖిలేశు
సర్వలోకరక్షు సన్నుతింతు
అర్థరక్ష కొరకు ప్రార్థన మ్మొనరింతు
వినర తెలుగుబాల ! వినుతశీల !

# తెలుగుబాలా!

నిజము బలుక వలయు నిత్యంబు మనుజుడు
పలుకలేని వాడు పాపి యగును
మానవులకు సత్య మహిమంబు జయ మిచ్చు
వినర తెలుగుబాల! వినుతశీల! 1

నిజము వలన మనిషి నిర్మల హృదయుడై
వెలయు జగతియందు వీరు డనుచు
సత్యముననె మనకు శాంతి సౌఖ్యము లబ్బు
వినర తెలుగుబాల! వినుతశీల! 2

ఆశలోన బడుచు అన్యుల కేవేళ
హాని గూర్పబోకు మాశ నరుని
పాప పాశ మగుచు బంధించి కుందించు
వినర తెలుగుబాల! వినుతశీల! 3

ఆసవలన లోభి దోసంబు జేయుచు
దోసమునను వాడు దాసుడగును
ఆశకంటె వేరు పాశంబు లేదురా :
వినర తెలుగుబాల ! వినుతశీల !

కలిగినంతలోనె శాస్త్ర బీదల కింత
పెట్టి పుణ్య మెవడు గట్టుకొనునొ
అతడె దేవు డంచు ననవలె నేవేళ
వినర తెలుగుబాల ! వినుతశీల !

ఆకలైనవేళ నంబలే యమృతంబు
చలికి దొరుకు బొంతె శాలువగును
అనుభవించి చెప్పినట్టి దీ వాక్యంబు
వినర తెలుగుబాల ! వినుతశీల !

పాలు త్రావినట్లు బలమిచ్చి రక్షించు :
మంచివారితోడి మైత్రిసేయ
కల్లుత్రావినట్లు కలచు దుర్జను మైత్రి
వినర తెలుగుబాల ! వినుతశీల !

తనను వలెనె పరుల దర్శించు నెవ్వండు
వాడె దైవసముడు వసుధలోన
అట్టివాని లోకు లందరు పూజింతు్రి
వినర తెలుగుబాల ! వినుతశీల ! 8

దయము ధర్మబుద్ధి దలచుచు మదిలోన
తననువోలె పరుల దలచు నెవడు
ఈశ్వరుండు వాని కిచ్చుర సంపదల్
వినర తెలుగుబాల ! వినుతశీల ! 9

ఖలుని చెంత జేరి ఘనభాషణము లాడ
పాలువోయు టగును పామునోట
దుష్ట సహవసతులు కష్టమార్గంబురా :
వినర తెలుగుబాల ! వినుతశీల ! 10

విద్య లేకయున్న సుద్దమొద్దని యందు్రి
విద్య నరుల కెందు వినయమిచ్చు
కొద్ది మాటకాదు బుద్ధిమంతుల కిది
వినర తెలుగుబాల ! వినుతశీల ! 11

సజ్జనునకు చదువు సద్భూషణంబురా !
విద్యవలన నరుడు విమలు డగును
ఘనత నిచ్చి విద్య ఘనులతో సరిదూచు
వినర తెలుగుబాల ! వినుతశీల !

విద్య వినయ మిచ్చు విశ్వ మెల్లను మెచ్చు
గౌరవంబు మరియు ఘనత హెచ్చు
విద్య మౌఢ్యతమసు విదళింపగా చిచ్చు
వినర తెలుగుబాల ! వినుతశీల !

పోతనార్యు వలెను కైత నల్లినవారు
తెలుగు గడ్డయందు తేటపడరు
సహజ పండితుండు సాహితిశ్రీనిధి
వినర తెలుగుబాల ! వినుతశీల !

పదపదమ్మునకును పంచదారయు పాలు
కలిపి పోసినట్టి కవివరుండు
చదువ తేటపడును సాహిత్య మాధురి
వినర తెలుగుబాల ! వినుతశీల !

భాగవతము చదువ భవనివారణ మగు
భక్తులకును జ్ఞాన సక్తులకును
అంతపాటి గ్రంథ మవనిలో గనరాదు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 16

అట్టి కవులగూర్చి యనుదినంబును మది
సంస్మరించువాడు సజ్జనుండు
పెద్దవారి నెపుడు ప్రేమచే నెఱుగుము
వినర తెలుగుబాల ! వినుతశీల ! 17

భాగ్యములును గలుగ బలగంబు చేకూరు
విద్యతోడ మిత్ర వృద్ధిగలుగు
నాదు చుట్టమంచు నాదు చుట్టం బంద్రు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 18

పేదపడిన వెనుక పేరైన నెత్తరు
ధనము గలుగువాడె ఘనుడు భువిని
ధనము లేక నెవరు దరి జేరనివ్వరు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 19

సమ్మతంబులేని సంభాషణము చేటు
శుచియులేని నరుని సూక్తి చేటు
అశుచి గల్గుకూర యనిన వెచ్చము చేటు
వినర తెలుగుబాల ! వినుతశీల !

ఎట్టి యాపదలను ఎట్టి వేళలనైన
సత్యవాక్కు విడగ జనదు నరుడు
సత్యమునవె నరుడు సర్వజ్ఞు డనిపించు
వినర తెలుగుబాల ! వినుతశీల !

సకల వేదశాస్త్ర సారమిద్దియె సుమ్మ
పరుల కష్టపెట్ట పాప మగును
పరుల కుపకరింప నిరుపమ పుణ్యంబు
వినర తెలుగుబాల ! వినుతశీల !

పరుల చెరుపబోకు పైన కోసము నీవు
పాపకార్యములకు పాటుపడకు
శాశ్వతంబుగాదు జగతిలో నేదియు
వినర తెలుగుబాల ! వినుతశీల !

వీరులందు ఘనుడు వీరహనుమంతుడు
ప్రభువులందు రామ ప్రభుడె ఘనుడు
భక్తులందు దేశభక్తుడు గాంధిరా !
వినర తెలుగుబాల ! వినుతశీల ! 24

వసుధ మానవులకు ప్రాణ మెంతయు తీపి
భాషలందు తెల్గు భాష తీపి
కళలయందు కావ్యకళయె ఘనమ్మురా :
వినర తెలుగుబాల ! వినుతశీల ! 15

జనని మాతృభాష జన్మభూమియు నిన్ను
గన్నతల్లు అంచు కాంచుతోడ
సేవజేయునెడల దేవపూజ లవేల
వినర తెలుగుబాల ! వినుతశీల ! 26

భక్తులందు పరమ భక్త ప్రహ్లాదుడు
యోగులందు వేమయోగి యోగి
శిష్యులందు మంచి శిష్యుడు సిద్ధప్ప
వినర తెలుగుబాల ! వినుతశీల ! 27

పుడమి వెలుగు రవియు పూర్ణిమ చంద్రుడు
తరుణి వెలుగు భర్త ధరణిలోన
సుతుని వెలుగు తల్లి మతివెల్గు విద్యరా :
వినర తెలుగుబాల ! వినుతశీల ! 28

భక్తజనుల నెల్ల భక్తితో కొలువుడి
భాగ్య సంపదలును పరగవీడి
మోక్ష మార్గమునకు ముక్తులై దరిజేర
వినర తెలుగుబాల ! వినుతశీల ! 29

భార్య బిడ్డ లున్న భాగ్య సంపదలున్న
ఇహము సౌఖ్యమునకు నుచ్చు సుఖము
పరమ సౌఖ్యమిందు పరమంత లేదురా
వినర తెలుగుబాల ! వినుతశీల ! 30

వేశమునకు మొదలు విలువనిచ్చును నమ్ము
భాషణమ్ము సభల భూషణమగు
వేష భాషలందు విద్య భూషణమురా :
వినర తెలుగుబాల ! వినుతశీల ! 31

పెనగు లాడబోకు పెద్దలతో నెప్డు
పరిహాసింపరాదు పన్నగముల
పోరు నష్టమయ్యు పొందు లాభంబురా :
వినర తెలుగుబాల ! వినుతశీల ! 32

మంచివాని కబ్బు మర్యాద గుణములు
కొంటెవాని కబ్బు కోతి పనులు
దుర్జనునకు నబ్బు దుర్బుద్ధి యిలలోన
వినర తెలుగుబాల ! వినుతశీల ! 33

దాన ధర్మముననె దైవంబు కరుణించు
ధరణి జనుల రక్ష ధర్మగుణము
ధర్మశీలుడన్న దైవ సమానుడు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 34

కవులు నిత్తు రెపుడు కావ్యప్రబంధముల్
తరులు నీడలిచ్చు తరచుగాను
సుజను డిచ్చు మనకు సుఖబోధ మార్గముల్
వినర తెలుగుబాల ! వినుతశీల ! 35

ఆవు లిచ్చు మనకు యమృత రసంబులు
ఫలము గోరకెపుడు పాడి యెంచి
ధర్మదాత ఇవ్విధంబున మెల్గురా!
వినర తెలుగుబాల! వినుతశీల! 36

పేదవాని మాట ప్రీతి నెంచరు జనుల్
సత్యమున్న నం దసత్యమున్న
ధనము గలుగువాడె ధరణిలో పెద్దరా!
వినర తెలుగుబాల! వినుతశీల! 37

సాతె తిరిగి చెడెను సన్యాసి తిరుగక
చెడె నటంచు జనులు చెప్పగలరు
తిరిగి తిరగకుండు టెరుగురా గుణశీల
వినర తెలుగుబాల! వినుతశీల! 38

శాంతి తల్లి మనకు సద్వర్తనము తండ్రి
దయయె గురుడు సూనృతమ్మె దైవ
మఖిల సద్గుణములె ఆత్మబంధువులురా!
వినర తెలుగుబాల! వినుతశీల! 39

కలిమి గలుగగానె ఘనముగా గర్వించి
తనను మించు గొప్ప దైవ మెవడు
యనుచు బలుకనేర్తు రవనిలో జనులెల్ల
వినర తెలుగుబాల! వినుతశీల! 40

కలిమి వీడగానె కలవర మొందుచు
ఈశ అన్య మెరుగ నీవు దప్ప
కావుమయ్య మమ్ము కరుణతో యని యంద్రు
వినర తెలుగుబాల! వినుతశీల! 41

కష్ట సుఖము లిలను కావడికుండలు
కలిమి లేము లెవరికైన వచ్చు
కొన్నినాళ్ళు వెలుగు కొన్నాళ్ళు చీకటి
వినర తెలుగుబాల! వినుతశీల! 42

మిడిసిపడెడి నరుడు పుడమిలో నొకనాడు
భంగపడును కొద్ది సంగతులనె
పెడుసుకట్టె యెపుడొ పెళ్ళున విరుగురా
వినర తెలుగుబాల! వినుతశీల! 43

గార్ధభమ్ము కేల కస్తూరి గంధమ్ము
దున్నపోతు కేల దూదిపరుపు
ముద్దువాని కేల ముద్దుముచ్చట లిల
వినర తెలుగుబాల ! వినుతశీల ! 44

మంచివాని చెలిమి త్రుంచివేయగరాదు
కొంటెవాని కూర్మి కోరరాదు
జెరికివాని తోడి ప్రియము లాడగరాదు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 46

చెనటివాని కేల సత్కథా శ్రవణంబు
రంభయేల పుంస్త్వ రహితునకును
మొరటువాని కేల మొగలిపూవాసనల్
వినర తెలుగుబాల ! వినుతశీల ! 47

పుట్టుతోడ దెల్యు పుష్పంబు వాసనల్
మంచివాని బుద్ధి మాటలందె
తేటపడును పరులు దెల్పుట ఏలరా !
వినర తెలుగుబాల ! వినుతశీల ! 48

కులముగాదు రన్న గుణమె ప్రధానంబు
బుద్ధి గలుగువాడె పెద్దయెందు
త్యాగమున్నవాడె దాతరా యిలపైని
వినర తెలుగుబాల ! వినుతశీల ! 49

అగ్నియన్న నొకటె అంగారుయన నొకటె
రాము డతడె మరి రహీం మతండె
అక్షరములె వేరు అర్థంబు లొకటిరా
వినర తెలుగుబాల ! వినుతశీల ! 50

ధనము గల్గువేళ తమయంతటను తామె
చుట్టముల మటంచు చుట్టుకొనరె
చెరువునిండ వచ్చు చేపల విధమురా
వినర తెలుగుబాల! వినుతశీల ! 51

పట్టుపురుగు తనదు పొట్టనుండియె వచ్చు
దారములనె దగిలి ధ్వంసమొందు
ఆశ యట్టులె నరుని పాశమై బంధించు
వినర తెలుగుబాల! వినుతశీల! 52

ఆడి తప్పరాదు అన్యులపై యెందు
చాడి చెప్పరాదు జనముముందు
నిజము లేనివాని నేస్తంబు రోతరా!
వినర తెలుగుబాల! వినుతశీల! 53

పొట్ట కొట్టవద్దు పెట్టలేకున్నను
పేదవారి మనము ఖేద మొందు
బీదవారినెపుడు ఆదరించుము తండ్రి!
వినర తెలుగుబాల! వినుతశీల! 54

పాడపాడ రాగ పరిణతి గనవచ్చు
మూల్గమూల్గ రోగములును వచ్చు
సాధనం బొనర్ప సకల విద్యలు వచ్చు
వినర తెలుగుబాల! వినుతశీల! 55

పరుల హితమె పరమభక్తుని ధర్మంబు
దండువాని కెపుడు తిండి చింత
మంచివాని కిలలో మరణమే సాక్షిరా!
వినర తెలుగుబాల! వినుతశీల! 56

పండితులును క్రింద నుండగ అల్పుండు
పీఠమెక్కి నిలువ పెద్ద యగునె
కోతి కొమ్మనుండ దంతి కే మొగ్గురా
వినర తెలుగుబాల! వినుతశీల! 57

దుష్ట సాహసంబు మట్టికుండను బోలు
పగులుబడిన మరల బాగుపడదు
చెడ్డవాని చెలిమి చెడిన తక్కెడదురా
వినర తెలుగుబాల ! వినుతశీల! 58

విష్ణుకన్న మరియు విశ్వేశ్వరునికన్న
తల్లిదండ్రె మనకు దైవ సములు
పుడమి యందు మనకు పూజ్యులు గురువులు
వినర తెలుగుబాల! వినుతశీల ! 59

అదురు బెదురులేక అన్యాయములులేక
భారతీయు డెపుడు భక్తి నమరి
మెలగవలయు నన్న మీర లీ విధమున
వినర తెలుగుభాల! వినుతశీల ! 60

కలిమి గలుగ జనులు గర్వంబుతో పేద
జనుల నాదరింప జాలకున్న
అట్టి కలిమి తుదకుమట్టి పాలౌ భువి
వినర తెలుగుబాల వినుతశీల. 61

తేలుకుండు తోక ములికిని విషమురా
పాముకుండు కోర పండ్ల యందు
ఖలున కుండు నిలువు నిలువెల్ల విషమురా
వినర తెలుగుబాల వినుతశీల. 62

దానములలో మేటి దానమె భూదాన
మతము లోనహిందు మతమె మతము
దీప్తి చెందిన విర దేశ దేశంబుల
వినర తెలుగుబాల వినుతశీల. 63

దేశమునకు రైతు దీపకణికయు బోలు
జీవములకు సర్వ జీవ్రులకును
ప్రాణికోటి కంత ప్రాణంబె రైతురా
వినర తెలుగుబాల వినుతశీల. 64

రైతులు లేకయున్న రాజ్యంబు లేదుగ
రైతె జగతి కంత రాజు బాబు
రైతు వలన సకల రాజ్యాల జీవంబు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 65

బుద్ధి వలన కర్మ శుద్ధి జెందును బాబు
శుద్ధి వలన మంచి శూరు లయ్యి
పెద్ద లగుదురయ్యా పేర్మితో జనులెల్ల
వినర తెలుగుబాల ! వినుతశీల ! 66

మాతృ హీనులైన పుత్రుల గతి నిశా
రాత్రి వలెను కుక్క రాతవలెను
తల్లి లేని బిడ్డ తలకు భారంబురా
వినర తెలుగుబాల ! వినుతశీల ! 67

బలము లేక నెన్నొ బంధాల వడిబడి
యిడుము లెన్నొ జనులు బడుచు నుంద్రు
బల విహీను డిలలో బరువురా జనులకు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 68

బలమె జీవనంబు బంధాల హేతువు
బలమె సర్వజనుల బ్రతుకు బాబు
బలము గలవాడె యిల మహావీరుండు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 60

సజ్జనాళి మైత్రి స్వర్ణ ఘటము వోలె
చెడిన మరల నతుకు ఇర్చవచ్చు
కుజను మైత్రి మట్టికుండయ ట్లతుకదు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 70

దేశసేవ కొరకు దీక్ష బూనగ వలె
శౌర్య ధైర్య సాహసములు గలిగి
భారతీయులకును పరమ ధర్మము లివ్వి
వినర తెలుగుబాల ! వినుతశీల ! 71

చెడిన కార్యములకు చింతిలు టెందుకు
పగిలె కుండ యనుచు వగవ ఫలమె
జరుగనున్న కార్య మెరుగుము చెడకుండ
వినర తెలుగుబాల ! వినుతశీల ! 72

భాగ్యములును లేక బందుగు లింటికి
రారు పల్కరించ బోరు కనరు
పైసతోనె సకల బంధుత్వమని యెంచు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 73

తనకు మెప్పిదమగు ధర్మంబుతోడనే
దారి నెఱిగి పేదవారి యందు
దయను దలపవలయు ధర్మాత్ము డిలలోన
వినర తెలుగుబాల ! వినుతశీల ! 74

కన్నులున్న గాదె చిన్నదీపం బైన
వెలుగు నిచ్చి దారి తెలియజేయు
బుద్ధి యున్నగాదె పూర్వించు చదువెల్ల
వినర తెలుగుబాల ! వినుతశీల ! 75

నీతి లేనివాని నుతిజేయుకంటెను
ప్రాణములను వీడి పరమునందు
జేరవలయు ధర్మశీలుండు జగతిన
వినర తెలుగుబాల ! వినుతశీల ! 76

పండితులను దూర పాపంబు చేకూరు
కూడు గుడ్డలకును కొరత గలుగు
పేదవారి మాట వేదవాక్యము గాగ
వినర తెలుగుబాల! వినుతశీల! 77

రాముడంత మేటి రమణి సీతను బాసి
సోదరునితో నడవి జొచ్చె నాడు
కష్ట సుఖము లెవరికైనను వచ్చురా!
వినర తెలుగుబాల! వినుతశీల! 78

నవ్య జగతిలోన నలుగురే పెద్దలు
కర్షకుండు మరియు కార్మికుండు
నదియుగాక నింక నధికారి వ్యాపారి
వినర తెలుగుబాల! వినుతశీల! 79

ఆశచేత జగము ఆడుచు నున్నది
ఆశ మోహబంధ పాశ మగును
జనుల కీడుపాలు నొనరించు చున్నది
వినర తెలుగుబాల! వినుతశీల! 80

మంచివాని గుణము లెంచి చూడగ దెల్యు
దయయు మరియు సత్య ధర్మగుణము
చెరుపు వాని కడకు నరుగుచే పాపంబు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 81

విద్య యెంతో గల్గి వినయంబు లేకున్న
నట్టి విద్య యంత వట్టి దయ్యా
ఫలము లున్న తరువు తలవంచు చూడరా
వినర తెలుగుబాల ! వినుతశీల ! 82

నిజము నెరుగకుండ నెన్నొ కల్పింతురు
నరుల మాటలన్ని నమ్మరాదు
పొల్లు చెరుగు చేట పోల్కి కల్ల త్యజించు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 83

దైవ చింతనంబు దలప నేరనివాని
బుద్ధి నెంతదయ్యు కొద్ది దగును
హరిని గొల్వకున్న అసుర శక్తి నశించె
వినర తెలుగుబాల ! వినుతశీల ! 84

వాదములను వీడి వేదసారము గ్రోలి
దైవ చింతనంబు దలపు వాని
ధాత మెచ్చు వాని దైవంబు మెచ్చురా!
వినర తెలుగుబాల! వినుతశీల! 85

ప్రేమ భక్తి గలిగి భీతి వీడియు జనుల్
కార్య రంగమునకు కదలవలయు
ప్రేమ సకల జనుల ప్రీతి ధనంబురా!
వినర తెలుగుబాల! వినుతశీల! 86

ప్రేమతోడ మనకు పెట్టినంతయె జాలు
నదియె గొప్ప ద్రవ్య మరసిచూడ
తిట్టి గంపెడంత బెట్టిన ఫలమేమి
వినర తెలుగుబాల! వినుతశీల! 87

పెద్దవాని చెంత ప్రెగ్గెలు బలుకుట
కొద్ది గుణము గాక బుద్ధి యగునె
వెర్రితనము నదియు తిర్రిబుద్ధిర బాబు
వినర తెలుగుబాల! వినుతశీల! 88

రాజమార్గమునను రాణించె నైరావ
తమును జూచి కుక్క తరిమి మొరుగ
గొప్పదగునె నడియు కుక్కగాకను ఇల
వినర తెలుగుబాల ! వినుతశీల ! 89

అదియె విధము బుధుల అజ్ఞాను లందరు
యెదిరి మొరుగ వారి కెగ్గు యగునె
గుట్ట కెగసిమొరగు కుక్క విధంబురా
వినర తెలుగుబాల ! వినుతశీల ! 90

మట్టికుండ బాబు ఇట్టి దేహము జూడ
పగులు నెపుడొ దెబ్బ దగులు నంత
పిట్టగూళ్ళ విధము గట్టిన యిండ్లెల్ల
వినర తెలుగుబాల ! వినుతశీల ! 91

పరుల దిట్టబోకు పాడు బుద్దిని నీవు
పిరికిపంద వగుచు బెరికి గాకు
పరులు మనము గూడ పరమాత్మ సుతులము
వినర తెలుగుబాల ! వినుతశీల ! 92

బ్రతికి చచ్చు వాని బ్రతుకు వ్యర్థంబురా
గతికి బ్రతుకు కుక్క గతిని వోలె
చచ్చి బ్రతుక వలయు సజ్జనుం డిలలోన
వినర తెలుగుబాల ! వినుతశీల ! 93

వేసమేసి పరుల మోసగించుట తప్పు
మోసగించు వాని మూర్ఖు డండ్రు
మూర్ఖుడైనవాడె మోసగించును బాబు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 94

కలిమి యున్నవాడె ఘనుడురా జగతిలో
ధనమె సకల జనుల జనని యెందు
కలిమి లేకయున్న గౌరవించరు జనుల్
వినర తెలుగుబాల ! వినుతశీల ! 95

భాగ్యదాత కడకు బహుజన సంఘంబు
పిలువకున్న తామె ప్రీతితోడ
చేరుచుందు రయ్యా జీవన దాతని
వినర తెలుగుబాల ! వినుతశీల ! 96

బ్రతికి చచ్చు వాని బ్రతుకు వ్యర్థంబురా
గతికి బ్రతుకు కుక్క గతిని వోలె
చచ్చి బ్రతుక వలయు సజ్జనుం డిలలోన
వినర తెలుగుబాల ! వినుతశీల ! 93

వేసమేసి పరుల మోసగించుట తప్పు
మోసగించు వాని మూర్ఖ డంద్రు
మూర్ఖుడైనవాడె మోసగించును బాబు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 94

కలిమి యున్నవాడె ఘనుడురా జగతిలో
ధనమె సకల జనుల జనని యెందు
కలిమి లేకయున్న గౌరవించరు జనుల్
వినర తెలుగుబాల ! వినుతశీల ! 95

భాగ్యదాత కడకు బహుజన సంఘంబు
పిలువకున్న తామె ప్రీతితోడ
చేరుచుందు రయ్యా జీవన దాతని
వినర తెలుగుబాల ! వినుతశీల ! 96

జారబుద్ధి మరియు చోర గుణంబులు
మానవులకు నివియు మరణ మందు
మరణమన్న నివియె మనియుండి చచ్చుట
వినర తెలుగుబాల ! వినుతశీల ! 97

ఒక్కడైన చాలు నిక్కమైనవాడు
కలుగనేటి కయ్య ఖలులు చాల
తల్లి కడుపు చేటు తండ్రి హృది పోటు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 98

పంది కడుపునందు పది కూనలునుగల్గ
ఫలము దేనికయ్య బాబులార
కనును సింగ మొకటి ఘను నొంటిబిడ్డను
వినర తెలుగుబాల ! వినుతశీల ! 99

గడ్డములను బెంచి ఘనులము మే మంచు
దుడ్డెలకును జెప్పె దొడ్డవారు
ధరణిలోన వారు ధన్యులు కారురా !
వినర తెలుగుబాల ! వినుతశీల ! 100

గొప్పవారు నివుర గప్పిన నిప్పులై
గానవత్తు రుర్విలోన నెందు
చెప్పబోరు వారు గొప్పవారల మని
వినర తెలుగుబాల ! వినుతశీల ! 101

పుట్టుమొద్దు కెపుడు పొట్టకూటిదె చింత
సజ్జనునకు నెపుడు చదువు చింత
దుష్టబుద్ధి కెపుడు దుర్మార్గ చింతయే
వినర తెలుగుబాల ! వినుతశీల ! 102

ఖరము నొకటి దెచ్చి గంగ నీళ్ళను ముంచ
గంగిరెద్దు యగునె ఖరము గాక
పుట్టువన్నె లేక పెట్టు వన్నె లవెంత
వినర తెలుగుబాల ! వినుతశీల ! 103

మత్తులన్న నివియె మదము మాత్సర్యముల్
మనుజు నెపుడు నివియె మదిగలంచు
బుద్ధి బలము లన్ని పూర్ణ నాశము జెందు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 104

దొడ్డబుద్ధి బలుని దూరిన మదిలోన
కలత నొందబోడు ఖలుల దలచి
కొద్దిబుద్ధి వాన్కె కోపంబు లావురా !
వినర తెలుగుబాల ! వినుతశీల ! 105

మేలి బంగరముకు మెరుగు నొసగిన భంగి
సజ్జనునకు సాధు సంగమంబు
ఘనత నిచ్చునెంతొ కార్యశూరుని జేయు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 106

కానివాని మాట కాసుకైనను జెల్ల
దవని యందు నెంత యనఘుకైన
తామసంబు వాని తప్పక చెరచురా !
వినర తెలుగుబాల! వినుతశీల ! 107

విద్యలోని భావ మిసుమంత నెరుగక
చదువునట్టి వాని చదువు చదువె ?
అర్థ మెరుగకున్న వ్యర్థంబురా విద్య
వినర తెలుగుబాల! వినుతశీల! 108

విద్య లేనివాని కి వినయంబు బోధించ
గద్దరించుగాని ఘనత గనునె
మొద్దువాని కేల మొగలి పువ్వాసన
వినర తెలుగుబాల ! వినుతశీల ! 109

వెర్రివాని కేల సద్గ్రంథ పఠనంబు
తిర్రివాని కేల తీపి రుచియు
మల్లెపూల ఘ్రాణి గొల్ల వా డెరుగునా !
వినర తెలుగుబాల ! వినుతశీల ! 110

కొర్వి చిచ్చువంటి కోపితో తగవును
తీర్ప యత్నమింప తిరుగు నెదురు
మసలుతున్న తైలమందు జల్లిన నీరు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 111

అడుగరాదు బాబు అతి లోభులను జేరి
కొలువరాదు బాబు కఠిన క్రూరు నవని
నిలువరాదు బాబు నీచుల కడ నెప్డు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 112

కంఠ శోషణమ్ము శుంఠల స్తోత్రాలు
అంటరాని వార లవని వారె
కంటకమ్ము నీలకంఠుపై నుంతురె ?
వినర తెలుగుబాల ! వినుతశీల ! 113

మానధనుని ప్రేమ మహి సుధార్ణవమురా
కామి ప్రేమ రొచ్చుకాల్వ సుమ్ము
స్వార్థపరుని కొలువు శవజాగరంబురా
వినర తెలుగుబాల ! వినుతశీల ! 114

దయయు త్యాగబుద్ధి పియభాషణము లివి
మూడు సజ్జనులను వీడ వెందు
ఖలుని పజ్జవాని గనలేము కలనైన
వినర తెలుగుబాల ! వినుతశీల ! 115

దేశ భక్తి శాంతి ధీరత్వ మనుకంప
సత్యచింతనమ్ము జగతిలోన
భారతీయ నోము పంట లైదును గన
వినర తెలుగుబాల ! వినుతశీల ! 116

ఆశయును నబద్ధ మతికోప శీలంబు
ధూర్తతనము మరియు దుష్టచింత
స్వార్థపరునిలోని చచ్చు గుణములు తెల్య
వినర తెలుగుబాల ! వినుతశీల ! 117

ఉత్తముని గుణంబు లెత్తెరగున నీచు
డెరుగగలడు వానికేల వలయు
రావణునికి ఏల రాముని గుణతతుల్
వినర తెలుగుబాల ! వినుతశీల ! 118

కవులటన్న ప్రేమ గౌరవంబుల జూపి
రాజరాజు లపుడు పూజ సల్ప
పొట్ట కవులటంచు తిట్టిపోయుదు రిప్డు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 119

ఎంతపనికి నైన నుంతమాత్రంబైన
బలములేక నది సఫలము గాదు
బలముతోనె కర్మ ఫలసిద్ధి పొందురా !
వినర తెలుగుబాల ! వినుతశీల ! 120

ఎంతబలము గలదో అంతయే ఫలమబ్బు
పిండి కొలది రొట్టె యుండునట్లు
బలము దైవశక్తి ఫలమురా! బలమురా
వినర తెలుగుబాల! వినుతశీల! 121

చాటు జోళ్ళ వినకు సరసుడవై నచో
పాటు పడుము దేశ ప్రతిభ గూర్చి
సూటిలేని మాట నోటి తీటయుగాదె?
వినర తెలుగుబాల! వినుతశీల! 122

సన్నజాజులందు చిన్నని ముండ్లుండు
గొప్పవారి లోన తప్పు లుండు
తప్పు ఏల దాని గొప్పయె గావలె
వినర తెలుగుబాల! వినుతశీల! 123

తెలుగు కవుల యందు తిక్కన మొనగాడు
రాగసుధల నింపె త్యాగరాజు
భక్తి నొసగు ముక్తి భాగవతంబురా
వినర తెలుగుబాల! వినుతశీల! 124

కీడుసల్పు ఘనుడు కీడు చేయగనేర
డెంత మాత్రమైన ఎగసిపడడు
పాలవంటి గుణము పరమ భక్తులదిరా !
వినర తెలుగుబాల ! వినుతశీల. 125

గుణవిహీను చెంత గుణగణాఢ్యుడు మెల్గ
తప్పు దతని కీడు తరచి చూడ
అగ్గికణము వద్ద వెన్నముద్దయుబోలు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 126

బుద్ధి మంచిదైన శుద్ధిజెందును పనుల్
ఘనులు మెత్తు రతని ఘనత గూర్చు
బుద్ధదైవ సూక్తి ముద్దుగ రాజిల్లె
వినర తెలుగుబాల ! వినుతశీల ! 127

వచ్చువేళ దరికి వచ్చును తనయంత
కానినాడు రాదు కష్టపడిన
సిరియు, యిష్టతోడ మురియుచు దినవచ్చు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 128

తెలుగు బాలకులకు తెలుగె యందము రన్న
పలుకు లెన్నియన్న పాటి యేమి
తెలుగు బాల వెలుగు కళల వెన్నెల జిల్కు
వినర తెలుగుబాల ! వినుతశీల ! 129

దేశ భాషలందు తెనుగు లెస్స యటంచు
తెనుగుభాష తేనె తీపి యనుచు
పలుకుచున్న బుధుల పలుకుల మహిమమ్ము
వినర తెలుగుబాల ! వినుతశీల ! 130

మంగళమ్.

తరణి ప్రెస్, మహాంకాళి స్ట్రీట్, సికింద్రాబాదు.